ముద్రాపకులు
శ్రీ సాధన ముద్రాశాల
అనంతపురము

రెండవ కూర్పు

వెల ఒక అణా

ఆంధ్ర మహాసభ వారిచే ప్రచురితము.

ప్రతులు
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యాలయమున
దొరకును.

B

## మొదటి కూర్పు విన్నపము.

ఇందాంధ్రసమస్యలలో ముఖ్యమగు రాష్ట్రవాదము-తదర్గతలు వివరింపబడుటచే దీనిని 'ఆంధ్రరాష్ట్రము' అనుట తటస్థించినది.

కాంగ్రెసు కార్యవర్గమువారిని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమును, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమువారిని ఆంధ్రమహాసభ-ఆంధ్రపత్రికలను తీవ్రమగు వత్తిడిచేసి శాసనసభ్యులచేతను, ప్రభుత్వముచేతను ఆంధ్రరాష్ట్ర విభజన మంగీకరింపజేయవలెను. ఆంధ్రమహాసభను రాజకీయాభిప్రాయములతో సంబంధములేక ఆంధ్రరాష్ట్రవాద మంగీకరించు ఆంధ్రులందరు ప్రవేశించుటకు, ఆందోళన మొనరించుటకు అనువగు ప్రజాసంస్థగ జేయవలెను. శాసనసభ్యులు వెంటనే తీర్మానము నుపపాదింపవలెను. ఆంధ్రరాష్ట్రమును బడయవలెను. రాష్ట్రార్గతను నాయోపినంతవరకు చర్చించితిని. దోసగులుండిన క్షమింతురుగాక. ఈగ్రంథము నుచితముగ ముద్రించి యిచ్చిన సత్తెనపల్లి శ్రీ కృష్ణాముద్రాక్షరశాలాధిపతులకును, మిత్రులు శ్రీ బత్తుల రామదాసుగారికిని నేనెంతయు కృతజ్ఞుడను.

సత్తెనపల్లి }
౫-౯-౩౪ }

ఇట్లు ఆంధ్రసేవాభిలాషి,
వావిలాల గోపాలకృష్ణయ్య.

## రెండవకూర్పు విన్నపము.

ఈ 'ఆంధ్రరాష్ట్రము' మొదటికూర్పు రెండు నెలలలోననే అయిపోయినవి. అనేకమంది మిత్రులు ప్రతులను కోరియున్నను లేవనవలసివచ్చెను. ప్రచురణమునకు పలువురు కోరియుండిరి కాని వ్యక్తులకుగాక, ప్రజాసంస్థల కివ్వదలంచితిని, అందును ఆంధ్రమహాసభయగుట సంతసదాయకము. వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

మకాం అనంతపురం }
౨౪-౪-౩౫ }

ఇట్లు తమ విధేయుడు,
వావిలాల గోపాలకృష్ణయ్య.

ఆంధ్రాభ్యుదయమునకు హేతుభూతులగు

కీర్తిశేషులైన దేశోద్ధారక — విశ్వదాత

కాశీనాథుని నాగేశ్వరరావుగారికి

హృదయపూర్వకముగా భక్తిపురస్సరముగా

ఈ 'ఆంధ్రరాష్ట్రము' సమర్పితము

D

ఓమ్

# ఆంధ్ర సమస్య

"తెలుగుంజాతికి, పౌరుషంబుగల ద
ద్రిస్వామికన్యాకృపా
కలనంబుంగల దీదృశంబుగ మహా
కష్టంబు లీనాటికిం
గలిగెంగాని కృతారకృత్తరిపురా
టక్రాంతనుశ్రీతాసృజ్ఞదీ
జలసంసిక్తజయేందిరాస్యము మహా
శౌర్యంబు సామాన్యమే!"

—ఆంధ్రపౌరుషము.

## పూర్వగాథ.

ఆంధ్రులు ఐతరేయ బ్రాహ్మణమునందు సయితము పేర్కొనబడి యుండుటవలన నంతకు మిక్కిలి పురాతనవంశజు లనుట స్పష్టము. ఆంధ్రులు మున్ముందు కృష్ణాతీర నివాసులుగ నుండి క్రీస్తు శకమునకు గొన్ని శతాబ్దములకు బూర్వమే బందరు సమీపమున శ్రీకాకుళమును బ్రధాననగర మొనరించుకొని రాజ్యపాలన మాచరించి, పిదప అమరావతి చెంత ప్రస్తుతము ధరణి

కోటయని పిలువబడు ధాన్యకటకమును ముఖ్యపట్టణ ముగ స్థాపించుకొని గోదావరి కృష్ణానదుల మధ్యరాజ్య ము నంతను నాక్రమించి; పిమ్మట కొంతకాలమునకు దక్షిణాపథమును, ఉత్తరదేశమును క్రమక్రమముగ వ్యాపించి, తుదకు గంగాతీరమున మగధవంశజుల స్థాన మగు పాటలీపుత్రమున క్రీస్తుశక ప్రారంభమునకు ౨౭ సంవత్సరముల పూర్వము ఆంధ్రసామ్రాజ్య సింహాసన మధిష్ఠించి భరత వర్షమునకు సార్వభౌములై ౪౫౦ సం వత్సరములు పరిపాలన మొనరించిరి.

శాలివాహన వంశమున గౌతమీదేవికి జనన మంది విశ్వవిజయోత్కృత యశోవిరాజమైన గౌతమీపుత్ర శాతకర్ణ శాతవాహనుడు సుధాన్యకటక నగర మహా మంటపమున క్రీస్తు పూర్వము 300 సంవత్సరముల క్రితము ఆంధ్ర విజయోత్సవమును నెరపెను. ఆంధ్రుల విజ్ఞాన నికేతన మనజెల్లిన ధాన్యకటకమున ననేక దేశా గత విద్యార్థిబృందమును సమీకరించి నిత్యము పదు నైదువేల విద్యార్థు లధ్యయనము గావించుట కాశ్ర యమైన పవిత్ర కృష్ణవేణీతీరమున విశ్వవిద్యా పరిషత్తుగ బరిఢవిల్లి విదేశ యాత్రికుల ప్రశంసలతో జెన్నలా రారెను. కళింగ పట్నము, శ్రీముఖలింగక్షేత్రము, అమరావతీ క్షేత్రము, వేంగీనగరము, విద్యానగరము

.........ఎన్నియో నగరములు వెలసి లోకవిఖ్యాతి గడసి విజ్ఞానుల ప్రశంసకు లోనైనవి. మార్గసౌకర్యములుగాని, విశేషముల నరయుటకు అందజేయుటకు అనువగు సాధనములుగాని లేని తెలియజాలని దేశములకు, ఖండాంతరములకు, దీవులకు జో సాహసించి, సంవత్సరముల తరబడియు వడవలలో ప్రయాణ మొనరించి, వివిధ దేశములలో తమ వస్తుసామగ్రిని, వస్త్రపరంపరను విక్రయించి స్వర్ణవాహినులచే ఆంధ్రమాతృ పాదపద్మముల పూజన మొనరింప గలిగిన ఆంధ్ర వాణిజ్య దీక్షాదక్షతలు వివిధదేశ చారిత్రక పరిశోధకులకు నేటికిని ఆధారభూతములై, ఆశ్చర్య జనకములుగ నున్నవి.

అటుపైని నోరుగల్లున బ్రవర్ధిల్లిన కాకతీయవంశజులగు ప్రతాపరుద్ర రుద్రమదేవుల చారిత్రములు సుప్రసిద్ధములు. మరియు బళ్ళారి మండలమున పంపా సరోవర ప్రాంతమున విజయనగరమును పాలించి దిగ్విజయ యాత్రల నొనరించి ఏకచ్ఛత్రముగ క్రీ. శ.౧౫౦౯–౨౯ వరకు పాలన మొనరించిన శ్రీకృష్ణదేవరాయల యశశ్చంద్రికలు ఆంధ్రజాతీయ జీవన వికాస మొనరించెను.

మధ్యయుగమునందలి వేంగిచాళుక్యుల పరాక్రమమును పల్నాటివీరుల వీరవిహారమును, క్షత్రియ

పుంగవుల పాత్రమును, నాయకుల నాయకత్వము, కమ్మవీరుల కదనపాండిత్యమును, రెడ్డియోధుల రోషావేశ సంకలిత సమరసన్నాహమును, మంత్రిశిఖామణుల మహిత మంత్రాంగ సమగ్రతలును, వివిధ దేశీయుల దండయాత్రల నుండి, దాడులనుండి, దోపిడుల నుండి నిరంతర మాంధ్రదేశము రక్షింపబడెను. ఆంధ్రమాత సిగపూ వాడని మహాగౌరవ భాజనమై పలువిధ భాషారాష్ట్రమాతలలో తలనెత్తుకొని తిరుగుభాగ్యము బొందెను. తద్యశోప్రభలు దిగంత విశ్రాంతములయి ప్రకాశించినవి. శ్రీ కృష్ణదేవరాయల పాలనమున నాంధ్రుల స్వాతంత్ర్యము, సారస్వతము, భాషావైదుష్యము, కళలు, రాజనీతి, రాజకీయదక్షతలు - వీనికొక మహద్దశ. అది అంతటితో నంతర్దశ నందినది. ఈ వంశీకులు విజయనగరమును మహమ్మదీయులకు గోల్పోయినపిదప చంద్రగిరివద్ద రాజ్యమేలిరి. చెన్నపురియందాంగ్లేయులు నివాస మేర్పరచుకొనుట కాశ్రయార్థమొసంగబడిన కోట మొదలగు స్థలముల ననుగ్రహించిన దీరాజవంశీకులే!

రాజకీయముగ మహమ్మదీయ సామ్రాజ్యము ఆంధ్రభూమి నాక్రమించినను ఆర్థికముగ నేనాడు బ్రిటీషు పాలనము ఆంధ్రజాతి నావరించెనో, ఏనాడు చందగ్రిరి

రాజు చెన్నపురిని ఆంగ్లేయుల హస్తగత మొనరించెనో, ఏనాడాంధ్రదేశమును బ్రిటిషు ప్రభుత్వమును, హైదరాబాదు నవాబును ఒండొరులు పంచుకొనిరో ఆదిన మాంధ్ర దౌర్భాగ్యదినము. అంతటితో ఆంధ్రము ఛిన్నాభిన్నమై చీలికలై ఆంధ్ర కుటుంబము విభాజ్యమై ఆంధ్రవిజ్ఞానాభివృద్ధి, ఆంధ్ర ఆర్థికాభివృద్ధి, ఆంధ్ర తేజోభివృద్ధి, ఆంధ్ర ఐక్యతాభివృద్ధి, అది యిది యననేల ఆంధ్ర సర్వస్వము దారములేని దండతీరున దారియు తెన్నునులేనిదై ఆంధ్రతత్వము ఆంధ్రసమస్యారూపము దాల్పవలసివచ్చెను,

నిజాము రాజ్యములోని అధిక ప్రాంతమును మధ్య రాష్ట్రములలోని బస్తరుసంస్థానము, చాందాజిల్లాయును చెన్నరాజధానిలోని గంజాం, విశాఖపట్నము, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు, బళ్ళారి మండలములును; మైసూరులోని కొంతభాగమును చేరిన విశాలదేశము ఆంధ్రదేశము. ఇట్టి సుప్రసిద్ధ పూర్వచరిత్రగల పవిత్ర దేశము ఆంధ్రుల జన్మభూమి.

ఈవిధముగ ననేక సంస్థానములలో పలుతావుల నున్న ఆంధ్రభూమిలో గొంత భాగము బ్రిటీషువారి

హస్తగతమగుటతో ఆంధ్రులలో పరస్పర మెడబాటు తటస్థించెను.

నైజాములోని ఆంధ్రులకుగాని, మైసూరులోని ఆంధ్రులకుగాని భాషావిషయికముగ బ్రిటీషు ఆంధ్రులతో పనియుండిన (అదియు నరుదే) నుండవచ్చునేమోగాని, ఆర్థికముగగాని, వ్యావహారికముగగాని, రాజకీయముగగాని పరస్పర సంప్రదింపులతో బనియేలేదు. నైజాం (హైదరాబాదు) మహమ్మదీయ సంస్థానమగుటచేతను, అచటి విజ్ఞానము, నడవడి, కృషి, అచటి లిపి, భాష అంతయు మహమ్మదీయానుయాయియగుటవలనను, వారి ఆచారములు, వ్యవహారములు, భేదించుచున్నవి. అటులే మైసూరు సంస్థానము కన్నడులదగుటచేతను, వారి యాచారములు, సాంప్రదాయములు భాషా, లిపులు కొంతవరకు మనలను పోలియుండినను రాజకీయార్థిక వ్యవహారిక సంబంధములు లేనందున లక్ష్యము భిన్నమై వేరుమార్గమున నడువజొచ్చెను.

ఈ పైకారణములచే ఆంధ్రభూమి పలుపేలికలుగను, చీలికలుగను విభజింపబడుటతో నెన్ని వేల సంవత్సరములనుండియో ఏకోన్నతమై, బలాధికమై, ఐక్యమై, సాహసోపేతమై వరలిన ఆంధ్రజాతి—ఛిన్నాభిన్నములుగ నేర్పడి పలువతాకములకింద ప్రాణములు నిల్పుకొన

నభిగమ్యమగుటతో ఆంధ్రపతాకము విస్మరింపబడెను. ఆంధ్రజాతి పిరికిపందయాయెను. ఆంధ్రులు అంధులైరి.

బ్రిటిషు ప్రజలు వర్తకులుగ నేనాడు చెన్నపురిలో తమ కోటను ఆంధ్రుల దయాధర్మములచే నిర్మాణ మొనరించుకొనిరో, పరిపాలన మేనాడు చెన్నపురిలో ప్రారంభింపబడినదో ఆనాడే ఆంగ్లమానస పుత్రులుగ మారిపోయిన తమిళసోదరులు బ్రిటిషు వారి పంచజేరి ఆంధ్రుల ఆచార వ్యవహారములకును, ఆంధ్రుల విజ్ఞానమునకును చివరకు ఆంధ్రుల ఆహార పానీయములకును భిన్నముగనున్న ఆంగ్లేయులయో, తమిళ సోదరులయో ఆచార వ్యవహారపరంపరలను మన అనుదిన జీవితములో చొప్పించుటతో; అప్పటికి అననేల ఇప్పటికిని ప్రజలదృష్టి నగరములకును, నగరములలో దినదినము దిగుమతియగుచుండు నాగరికతపైనను ప్రసరించుచు, స్వతంత్రబుద్ధి నశించి, స్వజాతిగౌరవ మడుగంటి, స్వీయసిద్ధాంతములు ఆచార వ్యవహారములు అసంగతములై, చంకదస్త్రముల ఆశలతో ఉద్యోగమను పేరిట దాస్యమునకు, నౌకరీలకు మళ్ళి ఆంగ్లేయులయొక్కయు తమిళులయొక్కయు, దయాధర్మములకు బిచ్చమెత్త వలసి వచ్చెను. అంతటితో వారికి భావదాసులైపోవుటయు తటస్థించెను. ఏనా డుద్యోగకాంక్షితులే విజ్ఞాన

ఘనులుగ తలంపబడజొచ్చిరో, పెద్దలుగ పూజింపబడ జొచ్చిరో, అట్టి యీఆధునికులు తమిళాంగ్ల వేషములతో గ్రామసీమలలోని కేనాడు ప్రత్యక్షమైరో ఆనాడే యావ దాంధ్రదృష్టి పరార్థప్రాపకమైపోయెను. ఆంధ్రభూమి లోని ఉత్తరాదిభాగమగు నైజాంరాష్ట్రీయులు, (మధ్య రాష్ట్రీయులసంగతి యటుండనిండు) మహమ్మదీయాను యాయులుగను, దక్షిణాదివారు ఆంగ్ల అరవ సంప్ర దాయ వ్యవహారానుయాయులుగను, పశ్చిమాంధ్ర భూభాగమున మైసూరురాష్ట్రమున నివసించు ఆంధ్రులు కన్నడ వేషభాషా సాంప్రదాయానుయాయులుగను వల వాటువడుటచే మధ్యాంధ్రులతో సంబంధ మంతరించెను. దినదినము ఆంధ్రుల భావములు హ్రస్వీకరింపబడి ఆంధ్ర తత్వము హృదయసీమల నెడబాసెను, ఆంధ్రసమిష్టి జీవితము మరవుతగిలెను. వ్యష్టిజీవనమే ప్రధానముగ, పొట్టతిప్పలే పరమార్ధముగ, నౌకరీసంపాదనమే ఉద్య మముగ ఆంధ్రుల కలవడిపోయెను.

ఆంధ్రజీవితమును, ఆంధ్రజాతీయతయును, భాషా వ్యవసాయమును, కృషిజీవనమును, ఆర్థికాభివృద్ధియు, విజ్ఞానవిశేషపరిశ్రమయు, సన్నియు వ్యక్తిజీవితమునకు, స్వార్థమునకు వినియోగింపబడజొచ్చెను. ఈ విధముగ నిరువదవ శతాబ్ద ప్రారంభమువరకు ఆంధ్రుల జాతీయత విస్మరింప బడెను.

ఆంధ్రుల అంతరాత్మ అంతరించెను. విశాల దృష్టి గర్భీభూతమాయెను. ఇతర రాష్ట్రముల విజ్ఞానాభివృద్ధులు, ఆర్థికాశయములు, విద్యావివేక వర్ధనములు దృగ్గోచరము కాజాలకపోయెను. అయినం తలో సర్దుబాటు చేసికొనుట అవకాశమున్నంతలో ముడుచుకొనుట, అర్హతాస్థానమును, హక్కును గుర్తిం చకపోవుట సంభవించెను. అంతవర కాంధ్రత్వము నిద్రాణమందినదనిన క్షమింతురుగాక ! ఆంధ్రులు తమ శక్తి, ఆదర్శము, వ్యక్తిత్వము, సాహసము, వివేకమును మరచిరి.

ఏనాడు వంగరాష్ట్రమును విభజించుచు ౧౯౦౬వ సంవత్సరమున ప్రకటన వెలువడినదో ఆనాడు భారత దేశమున కంతటికిని నూతనశకదిన మను విషయమున గాని, కర్జను ప్రభువు తన బెంగాలు విభజన ప్రతి పాదనముతో భారతరాజకీయములలో నేమి, భారత విజ్ఞాన కృషులలో నేమి నూతన సంచలనమును గలిగించు టకు కారణభూతుడాయెననుటలోగాని భేదించువా రెవరు నుండబోరు. విభజనవార్త ప్రచురమైన వెంటనే వంగీయులు తమ ఐక్యతకై పోరుసల్ప నిశ్చయించుటతో బాటు స్వజాతీయ విద్యావిధానములతో విజ్ఞానాభివృద్ధి కంజవేసిరి. అందులో నిదురించుచున్న భారతజాతి'

అందు గాఢనిద్రా ముద్రితమై యున్న ఆంధ్రజాతియును మేల్కొనినది, కనుదెరచినది.

స్వదేశీ ఉద్యమము, జాతీయవిద్యాభిలాష జనులలో నలముకొనినది. నూత్న తేజముతో మాతృదేశారాధన తత్పరతతో మాతృభాషాభ్యసనము, మాతృభాషాభివృద్ధి. మాతృభాషకై, మాతృదేశమునకై సేవజేయవలయునను తలంపు హెచ్చెను. ఆవిధముగ ౧౯౦౬ లో ప్రాదుర్భవించిన మాతృదేశ సేవాభిరతి, అందుతో జనించిన మాతృభాషా సేవాభిరుచులు సమ్మిళితములై హృదయము లుత్తుంగతరంగములై యువజన భావంబు లుల్లసిల్లెను.

## రాష్ట్రాందోళన.

అట్టి యువకుల హృదయ కోలాహలము నూత్నోత్సాహము స్వతంత్రతాశయ ఫలితమా యనునట్లు ఈ ఆంధ్రరాష్ట్రాందోళనము ౧౯౧౦ వ సంవత్సరమున నొక పుణ్యదినమున గుంటూరులోని యువజన సాహితీ సంఘము (యంగ్ మెన్స్ లిటరరీ అసోసియేషను) లోని ముచ్చటలలో లోకాభిరామాయణములో నిది యొక అభిరామాయణ మాయెను. శ్రీ జొన్నవిత్తుల గురునాథం, చల్లా శేషగిరిరావు, శిష్టు కాంభొట్లుగార్లు

పరస్పర సంభాషణములో దేశములోని రాష్ట్రములు భాషాప్రయుక్తములుగ విభజింపబడవలయుననియు తన్మూలమున ఆంధ్రరాష్ట్రము ప్రత్యేకము గావింపబడవలెననియు తలంచిరి. భాషారాష్ట్రవాద మాంధ్రులే ప్రారంభించిరనునది నిర్వివాదము.

ఆనాడే ఆంధ్రరాష్ట్రము (భావము) జనించినది. అది ఆంధ్రులకు పవిత్రదినము. చెట్టునీడ ముచ్చట్ల లోని 'ఆంధ్రరాష్ట్రము' వ్యాసరూపమున మొట్టమొదట దేశాభిమాని (గుంటూరులోని వారపత్రిక)లో బ్రచురించి శ్రీ చల్లా శేషగిరిరావుగారు ఆంధ్రలోకమున కర్పించిరి.

తదాది ఎవరికి దోచిన విధమున అనుకూల ప్రతికూలములతో నాంధ్రరాష్ట్రసమస్య విషయమై పలువురు ప్రముఖులచే ఆంధ్రపత్రికలలోను, ఆంగ్ల పత్రికలలోను, తీవ్రప్రచారము సాగింపబడెను. ఈ ఆందోళనము ఆంధ్రుల హృదయసీమలయం దదనున కృషిచేయబడెను. యావదాంధ్రుల హృదయము నాకర్షించి అది యొక ముఖ్యసమస్యగ నాంధ్రుల నుత్సాహపరచెను. ౧౯౧౦ వ సంవత్సరమున కొందరు యువకుల చెట్టునీడ ముచ్చటలలో నుత్పన్నమైన ఆంధ్రసమస్య ౧౯౧౩ వ సంవత్సరమునకు మహాసభారంగమున

జేరగలిగెను. అజ్ఞాతవాసములో, భావ పరంపరలలో, ఊహ, గానములలో, పత్రికా వ్యాసములలో మన ఆంధ్రసమస్య మహాసభామూలముగ నొక శక్తివంత మైన యుద్యమ మాయెను.

"ఒకభాష మాటలాడు జనులలో నొక తల్లిపాలు త్రాగువారికంటె నన్యోన్యభావము హెచ్చు. జాతీయ వ్యక్తి గాఢము. ఐకమత్యము మెండు. కావున ఆంధ్ర భాష నభివృద్ధి పరచినకొలది ఆంధ్ర జాతీయభావము హెచ్చెను. మరియు లోకమున నేజనుల కధికార పరం పర లధిక యోగ్యమో, స్వాతంత్ర్యము మెండో వారే బాహుబలము నందును, శౌర్యధైర్యముల యందును, బుద్ధిబలమునందును నధికులై విత్తార్జన సాధనముల సము కూర్చుకొని సంపదలతో దులతూగు చున్నారు. వారిలో కవులు, పండితు లుద్భవింతురు. శాస్త్రజ్ఞు లుందురు. కళానిధులు విలసిల్లుదురు. కోవిదులు ప్రబలుదురు. రాజ్యాంగతంత్ర ప్రవీణు లావిర్భవింతురు. వీరాగ్రేసరు లుత్పన్ను లగుదురు. అట్టి ఆధిక్యత ఆంధ్రులకు లభిం చుటకు ఆంధ్రరాష్ట్ర మత్యవసరము. అందుమూలమున నాంధ్రుల కున్నతోత్సాహములును, విశాలదృష్టియు ప్రజ్ఞావికాసమును గలుగును (ఆంధ్రులకు స్వతంత్రరాష్ట్ర ముండిన) నూతనోత్సాహము కలుగును. జీవితాశయము

లున్నతిజెందును. కళాప్రవీణత వర్ధిల్లును. విద్యలు ప్రబలును. కార్యనిర్వాహణౌత్సుక్యత యతిశయిల్లును. ఆంధ్రభాషను రాజ్యాంగభాషగ జేయుటకు వీలగును. ఆంధ్రమును రాజ్యాంగభాషగ జేయుటచే భాషాగౌరవ మతిశయించును. అట్టి గౌరవమువలన నాంధ్రభాష త్వరలో నభివృద్ధి జెందును. పాశ్చాత్య నూతన విజ్ఞానము జనులకు సుకరముగ నలవడుటకు ఆంధ్రభాష మూలముగ విద్య నేర్పబడవలెను. అట్లు కానియెడల దేశమున విద్య బాగుగ వ్యాపించదు. విద్యావ్యాపకము వలననే, విజ్ఞాన ప్రచారమువలననే రాజకీయ సాంఘిక ఆర్థిక అభివృద్ధి కలుగుట కవకాశము కలుగును. రాష్ట్ర నిర్మాణము వలన విద్యా ప్రతిష్ఠాపనములు సుకరములగును. పారిశ్రామిక కేంద్రము లభివృద్ధి గాంచును. నూతన జలాశయము లేర్పరచ ననువేర్పడును. నిరుద్యోగ సమస్యల బాపుటకు నూతన పంథాల ద్రొక్కనవకాశమేర్పడును. ఆంధ్రజిల్లాలు ప్రత్యేక రాష్ట్రముగ నేర్పాటు చేయబడుటచేత పరిపాలనా సౌష్టవము సమకూడును. కేంద్ర ప్రభుత్వముగాని, రాష్ట్ర ప్రభుత్వముగాని ఆంధ్రాభిమానముతో నుండుటకు ఒత్తిడిచేయ వీలగును. ప్రభుత్వమువా రాంధ్రుల యభివృద్ధినిగూర్చి యెక్కువ శ్రద్ధను జూపగలుగుటయు ఆంధ్రు లెక్కు-

వగ ప్రభుత్వమువారి సహాయము స్వీకరింపగలుగుటయు తటస్థించును. అరవసోదరులతో నాంధ్రులను కలిపి రాజ్యాంగము నడుపుటచే నాంధ్రు లగ్రస్థానములు చెందుట కవకాశము లరుదగుచున్నవి. ఆంధ్రమండలములను ప్రత్యేక రాష్ట్రముగ నిర్మాణ మొనరించిన యెడల స్వచ్ఛందాభివృద్ధి ప్రయత్నముల కెక్కుడవకాశము కలిగి కొంతకాలము లోపలనే ఆంధ్రులు సహజములగు కొన్ని యుత్తమ లక్షణముల నలవరచుకొని భారతీయులలో వన్నె కెక్కగలరు.

## ప్రత్యేక రాష్ట్రాందోళనము.

అందుకై ఆంధ్రులెన్నియో సంవత్సరములనుండి ప్రబోధకరమగు నుద్యమమును బయలుదేరదీసి ఆందోళన మొనరించుచున్నారు. ఇట్టి ఆందోళనా ఫలితముగ ౧౯౧౩ వ సంవత్సరమున ఆంధ్రమహాసభ ప్రాదుర్భవించినది. ప్రతిసంవత్సరమున ఆంధ్రరాష్ట్రాందోళనమునకు ఆంధ్రసమస్యా ప్రచారమునకు ఆంధ్రాభిమానులందరు నొకచోజేరి నాటి చర్చనీయముల ముచ్చటించి తీర్మానించి కార్యప్రణాళిక ననుసరించి కార్య నిమగ్నలగుచు మహాదుద్యమమును, ప్రజా ఉద్యమమును నిర్వహించు చున్నారు.

ఆంధ్రమహాసభ లీక్రింది ప్రదేశములలో నాయా ప్రముఖుల అధ్యక్షతను జయప్రదముగ నిర్వహింప బడుచున్నవి.

## ఆంధ్ర మహాసభలు.

| సంవత్సరము | ప్రదేశము | అధ్యక్షులు |
|---|---|---|
| ౧౯౧౩ | బాపట్ల | బయ్యా నరసింహేశ్వరశర్మ |
| ౧౯౧౪ | బెజవాడ | న్యాపతి సుబ్బారావు |
| ౧౯౧౫ | విశాఖపట్నము | పానగల్ రాజా |
| ౧౯౧౬ | కాకినాడ | మోచర్ల రామచంద్రరావు |
| ౧౯౧౭ | నెల్లూరు | కొండా వేంకటప్పయ్య |
| ౧౯౧౮ | కడప | నెమిలి పట్టాభిరామరావు |
| ౧౯౧౮ (ప్రత్యేక) | గుంటూరు | కాశీనాథుని నాగేశ్వరరావు |
| ౧౯౧౯ | అనంతపురం | గాడిచర్ల హరిసర్వోత్తమరావు |
| ౧౯౨౦ | మహానంది | ఎ. రంగనాథమొదలియారు |
| ౧౯౨౧ | బరంపురం | రాజా కోటగిరి వేంకటకృష్ణారావు |
| ౧౯౨౨ | చిత్తూరు | వేదము వేంకటరాయశాస్త్రి |
| ౧౯౨౩ | —— | —— |
| ౧౯౨౪ | మదరాసు | కట్టమంచి రామలింగారెడ్డి |
| ౧౯౨౫ | బందరు | సామి వేంకటాచలంశెట్టి |
| ౧౯౨౬ | ఏలూరు | రాజా వేంకటాద్రి అప్పారావు |
| ౧౯౨౭ | అనంతపురం | ఓ. లక్ష్మణస్వామి |
| ౧౯౨౮ | నంద్యాల | సర్వేపల్లి రాధాకృష్ణయ్య |

| | | |
|---|---|---|
| ౧౯౨౯ | బెజవాడ | క. కోటిరెడ్డి |
| ౧౯౩౦ | ---- | ---- |
| ౧౯౩౧ | గుంటూరు | వరహగిరి వేంకటజోగయ్య |
| ౧౯౩౧ (ప్రత్యేక) | చెన్నపురి | కే. కోటిరెడ్డి |
| ౧౯౩౨ (ప్రత్యేక) | బెజవాడ | కే. వి. రెడ్డినాయుడు |
| ౧౯౩౩ | — | — |
| ౧౯౩౪ | విశాఖపట్టణం | దేశపాండ్య సుబ్బరావు |
| ౧౯౩౫ | — | — |
| ౧౯౩౬ | కాకినాడ | వేమవరపు రామదాసుపంతులు |
| ౧౯౩౭ | బెజవాడ | క. కోటిరెడ్డి |
| | రజతోత్సవం: | టి.ఎన్. రామకృష్ణారెడ్డి |

ఈవిధముగ ఆంధ్రసభలు యేటేట జరుపబడి ఆంధ్రాభిలాష చల్లారిపోవలేదని ఆంధ్రులగాష్ట్రవాంఛ మరపు తగులలేదని, ఆంధ్రుల విజ్ఞానకృషుల ను త్తేజ మొనర్చుచు, ప్రజాప్రబోధము గావించుచు నాంధ్రుల యందు నూతనాభ్యున్నతిని, నూతనో త్తేజమును సాహ సమును పలుముఖముల వెదజల్లుచున్నవని ప్రస్ఫుటపర చుచున్నవి.

ఈ సాంవత్సరిక సభలు, మహాసభలు, సభలు జరుపుటమాత్రమేగాక వీనికితోడు రాజకీయాందోళన మును, తీవ్రసంచలనమును సాగించుచు ఆంధ్రరాష్ట్ర సమస్య జీవనసమస్యగ సాగిపోవుచున్నది.

## ఆంధ్ర విశ్వవిద్యాలయము

ఆంధ్రసమస్యలలో నొకటగు ఆంధ్ర విశ్వవిద్యాలయము నామమాత్రపుదే గానిందు. ౧౯_౨౬ సం॥ ఏప్రిల్ ౨౬ తేదీన బెజవాడయందు ప్రారంభింపబడెను.

## ఉత్తర సర్కారులు

ఆంధ్రదేశమున నుత్తరప్రాంతమగు ఉత్తరసర్కారులనబడు గంజాం, విశాఖపట్నం, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలు ౧౭౬౬వ సంవత్సరము నవంబరు ౧౨వ తేదీన హైదరాబాదు నైజాం బ్రిటీషువారికి (ఈస్టిండియా కంపెనీకి) ౯ లక్షల రూపాయలు లేక అవసరమగు దండు నొసంగు షరతుకు ధ్రువకౌలు కిచ్చెను. ఈకౌలు ౧౭౬౮ లో శాశ్వతమైపోయినది.

౧౭౯_౨ లో జరిగిన మైసూరు యుద్ధానంతరం ౧౭౯౮వ సంవత్సరమున తంజావూరు రాజు పదచ్యుతుడగుటతో నెల్లూరు, చిత్తూరు, అనంతపురం (కొంత) మండలములు బ్రిటీషులో చేరెను. దత్తమండలములని వ్యవహరింపబడు కర్నూలు, బళ్ళారి, కడపజిల్లాలు (కొంత) అనంతపురంజిల్లాయును నిజాంవలన ౧౮౦౦వ సంవత్సరమున బ్రిటీషువారికి దత్తత యివ్వబడెను. ఆంధ్రరాష్ట్రముగ ప్రత్యేకింపవలెననికోరు బ్రిటీషు ఆంధ్రజిల్లాలివి.

## కాంగ్రెసులో ఆంధ్రరాష్ట్రం

ఆంధ్రరాష్ట్రోద్యమము ౧౯౧౩వ సంవత్సరమున ప్రాదుర్భవింపజేయబడినదని ఆంధ్రమహాసభ ప్రారంభింపబడెనని నుడివియుంటిని. ఈ రాష్ట్రవాంఛ తగు నాందోళనముతో ప్రజాప్రబోధము గావింపబడుచుండెను. ౧౯౧౭వ సంవత్సరము అనిబిసెంటు అధ్యక్షతను కలకత్తాయందు జరిగిన భారతజాతీయ మహాసభ (కాంగ్రెసు) బాలగంగాధర తిలక్ గారి ఆదేశానుసారం ఆంధ్రుల భాషాప్రయుక్త రాష్ట్రవాదము న్యాయమని గ్రహించి కాంగ్రెసు నిర్మాణములో ఆంధ్రజిల్లాలను ప్రత్యేకరాష్ట్రముగ విభజించి ఆంధ్రుల కర్హతాస్థాన మొసంగెను. ౧౯౧౭వ సంవత్సరమున భారతదేశ రాజ్యాంగసంస్కరణల విచారణకు విచ్చేసిన మాంటెగ్యూ ఛమ్సుఫర్డులకు ఆంధ్రరాష్ట్రవాంఛను అర్హతాస్థానమును తెలియజేయుచు ఆంధ్రమహాసభ తరఫున విజ్ఞాలనము సమర్పింపబడెను. ౧౯౧౮వ సంవత్సరము ఇంపీరియల్ కౌన్సిలులో శ్రీ బి. యన్. శర్మగారు ఆంధ్రరాష్ట్ర తీర్మానము నుపపాదించిరి. ఆంధ్రమహాసభతరఫున ఇంగ్లాండుకు రాయబార మంపబడెను. శ్రీ మోచర్ల రామచంద్రరావుగారు జాయింట్ పార్లమెంటరీ కమిటీవారికి ఆంధ్రరాష్ట్రవిభజన మవసరమని

ప్రత్యేకవిన్నపము నొకదాని నొసంగిరి. ౧౯౧౯ వ సంవత్సరమున వెలువడిన మాంట్ ఫర్డు నివేదికలో భాషా రాష్ట్రవాంఛ న్యాయమని అంగీకరింపబడి ౧౯౧౯ వ సం॥ ఇండియా శాసనములో ౫౨ (ఎ) సెక్షను క్రింద రాష్ట్రవిభజన కవకాశము కల్పింపబడెను.

### శాసనసభలో ప్రత్యేకరాష్ట్ర తీర్మానము.

౧౯౨౨ వ సంవత్సరము భారత శాసనసభలో శ్రీ జయంతి రామయ్యగారు ఆంధ్రరాష్ట్ర తీర్మానము నుపపాదించిరి. ౧౯౨౮ వ సంవత్సరమున సైమన్ సంఘము రాజ్యాంగ విచారణకు వచ్చినది. ఇండియా గవర్నమెంటు రాష్ట్రపునర్విభజన విషయములో తమ తటస్థ భావమును వెలిబుచ్చుచు రాష్ట్రశాసనసభాభిప్రాయ మవసరమని సైమన్ సంఘానికి పంపిన నివేదికలో వ్రాసిరి.

౧౯౨౭ వ సం॥ మార్చి ౧౯ వ తేదీ చెన్నపురి శాసనసభలో (శ్రీ) పిల్లలమర్రి ఆంజనేయులుగారు మద్రాసు రాజధానిలోని ఆంధ్రజిల్లాలను ప్రత్యేక రాష్ట్రంగా విభజించవలెనని తీర్మాన ముపపాదించిరి. అది అధికసంఖ్యాకులచే నంగీకరింపబడెను. ఈ సంవత్సరమే భారతశాసనసభలో కొత్త తీర్మానముక్రింద తెచ్చిన భాషాప్రయుక్త రాష్ట్రవిభజన తీర్మాన మంగీ

కరింపబడెను. ఈ సంవత్సరమే శ్రీ వరహాగిరి వేంకట జోగయ్యగారు భారత శాసనసభలో ఆంధ్రరాష్ట్ర తీర్మాన ముపపాదించిరి. శ్రీ వేమవరపు రామదాసు గారు స్టేటుకౌన్సిలులో నొక తీర్మానము దెచ్చిరి. ఈ సంవత్సరముననే చాలా ఆందోళన జరుపబడెను.

మరల ౧౯౨౮ వ సంవత్సరం మార్చి ౧౯ వ తేది శ్రీ పిల్లలమర్రి ఆంజనేయులుగారు క్రిందటి సంవత్సరపు తీర్మానఫలితము తెలియుటకు, శాసనసభ్యుల అభిప్రాయము దెల్పుటకు, ప్రభుత్వ తాటస్థ్యమును విమర్శించుటకు కొత్త తీర్మానము తెచ్చిరి. అదియును గెల్చెను.

## నెహ్రూనివేదిక నిర్ణయము.

౧౯౨౮ అక్టోబరు ౨౮-౨౯ తేదీలయందు డా॥ అన్సారీగారి అధ్యక్షతను అఖిలపక్ష మహాసభ లక్నోలో జరిగి ఆంధ్రరాష్ట్రమును వెంటనే ప్రత్యేకించవలెనని తీర్మానించిరి. ౧౯౨౮ డిశెంబరు ౨౮-౨౯ ల యందును, ౧౯౨౯ జనవరి ౧-౨ తేదీలయందును కలకత్తాలో జరిగిన ఇండియన్ నేషనల్ కన్వెన్షను నందు ఆంధ్ర కర్నాటక రాష్ట్రములు వెంటనే ఏర్పాటు గావించబడవలెనని తీర్మానింపబడెను. ౧౯౨౮ వ

సంవత్సరములో తయారైన నెహ్రూనివేదిక ఆంధ్ర రాష్ట్ర విభజన మత్యావసరమని తీర్మానించెను.

౧౯౨౯లో సైమన్ సంఘనివేదిక ప్రకటింపబడినది. ఆంధ్రరాష్ట్ర సమస్య సాధారణాందోళనముగ తలంప వీలులేదనియు, నదియొక తీవ్ర రాజకీయ సమస్యగ పరిణమిల్లగలదనియు నుడివి సారాంశము తేల్చక గాలిలో విడచివేయబడెను.

## మదరాసు ప్రభుత్వపు అడ్డంకు

౧౯౩౦ ఆగస్టు ౧౧వ తేదీ ఇంగ్లాండు ప్రభుత్వమునకు మదరాసు ప్రభుత్వము వారు మెమో (విజ్ఞాపిక) సమర్పించుచూ ఆంధ్రరాష్ట్రము విభజన చేయవలదని ఘంటాపథముగా హెచ్చరించి తమ యథారూపమును బయటగ్రక్కి పానకములో పుడకవేసిరి.

## రౌండుటేబిల్ సభ.

౧౯౩౦లో సమావేశమయిన మొదటి రౌండు టేబిలు సభలో సింధు, ఒరిస్సా రాష్ట్రముల విభజన మంగీకరించుటలో ప్రభుత్వము భాషారాష్ట్రవాదము నంగీకరించెను. శ్రీ మోచర్ల రామచంద్రరావు, ఏ. పి. పాత్రోగార్లు సభలో నుండియు తామాంధ్రులమని, ఆంధ్రులు రాష్ట్రము వాంఛించుచున్నారని మరచిపోయిరి.

౧౯౩౧ లో రెండవ రౌండుటేబిలు సభలో శ్రీ వి. వి. గిరి, బొబ్బిలిరాజాగార్లు ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకముగ విభజింపవలసినదనుచు నొక విజ్ఞాపనమును దాఖలుచేసిరి. శ్రీ వి. వి. జోగయ్యగారు ఆంగ్లదేశములో ప్రచారము గావించిరి.

ఇండియాలో ౧౯౩౨ లో స్టేటుకౌన్సిలుసభలో శ్రీ గోపతి నారాయణస్వామిచెట్టిగారు ఆంధ్రరాష్ట్ర తీర్మానమునకు నోటీసునిచ్చి ఏలనో తీరా ఉపసంహరించుకొనిరి. ఇంతలో ఒరిస్సారాష్ట్ర విభజనతోపాటు ఆంధ్రరాష్ట్ర ప్రాంత్యములోని పర్లాకిమిడి, జయపురం, బరంపురములు ఒరిస్సారాష్ట్రములో కలుపుకొనుచు నొక ప్రభుత్వప్రకటన వెలువడెను. దాని కసమ్మతి తెలుపుటకుగాను శ్రీ వి. వి. జోగయ్యగారు మొదలగు ప్రముఖులు మదరాసు గవర్నరువద్దకు రాయబారము వెళ్లిరి. ప్రయోజనము లేకపోవుటచే శ్రీ వి. వి. జోగయ్య, కే.వి. రెడ్డినాయుడు, బొబ్బిలిరాజా, యార్లగడ్డ రంగానాయకులు, ఉన్నవ రామలింగంగార్లు ఇండియాప్రతినిధికడకు రాయబారము వెడలిరి. అదియు నిష్ఫలమాయెను. ప్రభుత్వధోరణిలో మార్పుండునా?

బొబ్బిలిరాజాగారి వ్యతిరేకత.

ఇంతలో బొబ్బిలిరాజా మదరాసు ప్రధానమంత్రి

యగుట, వెంటనే ఆంధ్రిరాష్ట్రి మక్కరలేదనుట తేట
స్థిరించినది.

౧౯33 మార్చి ౧వ తేదీన తెల్లకాగితము బయట
పడెను. అందు సింధు, ఒరిస్సారాష్ట్రిములను నిర్మాణం
చేయసూచించుచూ, ఆంధ్రప్రాంతము ఒరిస్సాలో కలు
పుకొన నుద్దేశము సూచించిరి. శ్రీ బొబ్బిలిరాజా
ఆంధ్రరాష్ట్రిం అక్కరలేదనటంలో ఆంధ్రదేశములో
తీవ్రాందోళన బయలుదేరెను. మరల ౧౯33 లో
చెన్నపురి శాసనసభలో ఆంధ్రిరాష్ట్రితీర్మానం ఉపపాదిం
పబడెను. తరువాత జాయింటు పార్లమెంటరీ కమిటీ
నివేదిక ౧౯3౪ లో ప్రకటింపబడినది. అందులో తెల్ల
కాగితం నల్లబడ్డది. తెలుగువారి మొఖాలు తెల్ల
బారెను.

## ఆంధ్రిలకు అన్యాయము

౧౯3౫ లో శ్రీ దేశపాండ్య సుబ్బరావుగారు
ఆంగ్లదేశంలో ఆంధ్రిరాష్ట్రిప్రచారం గావించిరి. ఒరిస్సా
లో కలిపిన ఆంధ్రి ప్రాంత్యములను విడదీయుమని
ఇండియా కార్యదర్శి మొదలగువారికిని విన్నవించిరి.
ఫలితము లేకపోయెను. ప్రచారం విరివిగా సాగించిరి.
ఆగష్టు ౨వ తేదీ ఇండియా ప్రభుత్వశాసనము పార్ల

మెంటు అంగీకరించెను. అంతటితో సింధు ఒరిస్సా నూతనరాష్ట్రము లేర్పడెను. ఆంధ్ర ప్రాంతములగు బరంపుర, జయపురం, పర్లాకిమిడి ప్రాంతాలు ఒరిస్సాలో కలసిపోయెను. ఆంధ్రులు అవమానమును అన్యాయమును భరించగలిగిరి.

౧౯౩౬ సంవత్సరము నూతన ఒరిస్సా, సింధు రాష్ట్రాలు ఏప్రిల్ ౧వ తేదినుండి ప్రారంభింపబడెను. ఆంధ్ర ప్రాంతాలు ఒరిస్సాలో కలిసిపోయినదానికి అనంగీకారంగా శ్రీ గిడుగు రామమూర్తిగారు పర్లాకిమిడి విడచి రాజమహేంద్రవరం జేరి స్థిరనివాస మేర్పరచుకొనిరి.

౧౯౩౭లో నూతన శాసనసభా ఎన్నికలు జరిగెను. ఆంధ్రులు దాదాపు ఎనుబది మంది శాసన సభ్యులైరి. ఆంధ్రరాష్ట్రవాంఛ శాసనసభలో నాందోళన సాగింప తలంపులు బయలుదేరుచున్నవి.

ఈవిధముగ నాందోళన మొనరించుచున్న రాష్ట్రవాంఛ యెంత వాంఛనీయమును! అర్హమును! సబబును నై యున్నదో గమనింపదగును. ఆంధ్రులు వైజ్ఞానిక సారస్వత చరిత్రలు ప్రజ్ఞావిశేషములను గలిగినవారే గాక నేటికిని భారతదేశమున జనసంఖ్యలో నాల్గవస్థాన

ము నాక్రమించుచున్నారు. అందుల కీ క్రింది అంకెలే నిదర్శనములు.

భాషలు.

| భాషలు | మాట్లాడువారి సంఖ్య. |
| --- | --- |
| హిందీ | ౭,౯౪,౧౪.౭౭౪ |
| బెంగాలీ | ౫౩౪,౬౮,౪౬౦ |
| బీహారీ | ౨,౭౯,౨౯!౫౫౯ |
| ఆంధ్రము | ౨,౬౩,౭౩,౭౨౭ |
| మరాటీ | ౨,౦౮,౯౦,౬౫౮ |
| తమిళం | ౨,౦౪,౧౨,౬౫౨ |
| పంజాబీ | ౧,౫౮,౩౯,౨౫౪ |
| రాజస్థానీ | ౧,౩౮,౯౬,౮౯౬ |
| కన్నడం | ౧,౧౨,౦౬,౩౮౦ |
| ఒరియా | ౧,౧౧,౯౪,౨౬౫ |
| గుజరాతీ | ౧,౦౮,౪౯,౯౮౪ |
| మళయాళం | ౯౧,౩౭.౬౧౫ |
| ఇంగ్లీషు | ౩,౧౯,౩౪౯ |

ఇట్టి ప్రబల జనసంఖ్యగల ఆంధ్రులు అనేక ప్రాంతములలో నివసించుట తటస్థించినది విడివిడిగ మైసూరు, హైదరాబాదుసంస్థానములలోను బొంబాయి కలకత్తా: రంగూన్, తమిళ దేశములలోను నున్నారు. అందులో మైసూరు, హైదరాబాదు సంస్థానములలోని ఆంధ్రజిల్లాలు, వాని వైశాల్యము అందలి జనసంఖ్య అందాంధ్రులసంఖ్య వివరింతును. పరికింపుడు.

## మైసూరు రాజ్యం.

| జిల్లా | వైశాల్యం | జనసంఖ్య | ఆంధ్రులు |
|---|---|---|---|
| కోలారు | ౩,౧౯౧. | ౮,౪౯,౦౩౭ | ౪,౮౩,౨౮౨ |
| బెంగుళూరు | ౨,౯౩౪ | ౧౦,౮౦,౪౧౩ | ౧,౫౭,౪౧౦ |
| తుంకూరు | ౪,౦౮౨ | ౮,౬౫,౪౦౫ | ౧,౧౧,౨౦౪ |
| చిత్రదుర్గం | ౪,౧౪౯ | ౬,౫౬,౫౬౯ | ౧,౪౨,౪౮౯ |
| మైసూరు | ౫ ౫౦౨ | ౧౫,౧౧,౧౨౬ | ౩౨,౭౩౬ |
| మైసూరాంధ్ర | ౧౯,౮౫౮ | ౪౯,౬౨.౫౫౦ | ౧౨,౨౭,౦౯౦ |
| మైసూరు | ౨౯,౩౨౬ | ౬౫,౫౭,౩౦ ౨ | ౧౦,౩౦,౯౨౬ |

## నైజాం ఆంధ్రులు

నైజాంప్రాంతమునగల ఆంధ్రులలో నుత్తేజము ప్రబలెను. భాషాప్రచారము కొంతలో కొంత సాగింపబడుచుండెను. ౧౯౧౫వ సంవత్సరం నైజాం ఆంధ్రజన కేంధ్రసంఘ నిర్మాణము గావింపబడెను. ప్రథమ ఆంధ్రమహాసభ మెదకుజిల్లా జోగిపేటలోను, ౨ వ మహాసభ నల్లగొండజిల్లా దేవరకొండయందు ౧౯౩౦వ సంవత్సరమునను, మూడవమహాసభ ౧౯౩౪ సంవత్సరములో ఖమ్మంమెట్టులోను జరిగినది. ప్రభుత్వ నిర్బంధమువల్ల ప్రస్తుతము సభలు జరుగుటలేదు. గ్రంథాలయోద్యమము, భాషాప్రచారోద్యమము నిర్వహింపబడుచున్నది. నైజాంలోని తెలుగుభూమిని తెలంగాణా అందురు. ఆ తెలంగాణా వివరము లివి:

## తెలంగాణా.

| జిల్లా | వైశాల్యం | జనాభా | ఆంధ్రులు |
|---|---|---|---|
| హైదరాబాదు | 53 | 4,66,894 | 1 73,357 |
| నిజామాబాదు | 3,265 | 6,23,225 | 5,45,198 |
| అట్రాఫ్-ఇ-బల్దా | 2,651 | 4,99,661 | 3,97,612 |
| వరంగల్ | 7,944 | 11,17,693 | 9,49,488 |
| కరీంనగర్ | 5,7221 | 2,41,405 | 11,68,062 |
| ఆదిలాబాద్ | 7,294 | 7,62,030 | 4,63,558 |
| మెదకు | 3,198 | 7,38,665 | 6,39,350 |
| మహబూబ్‌నగర్ | 5,326 | 9,71,616 | 8,21,802 |
| నల్లగొండ | 6,049 | 11,33,409 | 10,29,506 |
| తెలంగణా | 41,449 | 69,11,244 | 60,85,983 |
| నైజాం సంస్థాం | 86,698 | 1,44,36,148 | 69,72,534 |

ఇంతియేగాక ఇతర ప్రదేశాలలోను ఆంధ్రులు విశేషముగ నున్నారు.

| ప్రదేశం | సంఖ్య |
|---|---|
| తమిళదేశంలో | 30,00.000 |
| సింహళంలో | 200 |
| బర్మాలో | 1,20,000 |
| బొంబాయిలో | 2,00,000 |
| కలకత్తాలో | 3,00,000 |
| బస్తరు సంస్థానంలో | 48,000 |
| మారిషస్‌లో | 50,000 |

(మారిషస్ దక్షిణాఫ్రికాలోనిది) ఇంకా ఇతర

అనేక ప్రాంతాలలో విరివిగ ఆంధ్రులు జీవనార్థమై వివిధ వృత్తులలో నున్నారు.

ఇది ఇట్లుండ ఇప్పుడు బ్రిటీషుచే పరిపాలింపబడు చున్న ప్రాంతములలోనికి తేబడిన ఉత్తరసర్కారులు దత్తమండలములు (ఇది నీచవాచకముగ నుండుటచే దీనిని రాయలసీమయని వ్యవహరించు చున్నాము.) నెల్లూరు, చిత్తూరు మండలముల వైశాల్యము జనసంఖ్య నరయుటకు ముందుగ నొక విషయము చెప్ప వలసియున్నది. ఒరిస్సాలోనికి ఆంధ్రప్రాంతములగు జయపురం, బరంపురం, పర్లాకిమిడి ప్రాంతములు పోవుటచే నేడు గంజాంజిల్లా చెన్నరాజధానిలో నంతరించెను. అందుచే ఇక లెక్కలలోను (మరల నా ప్రాంతములు ఆంధ్రభూమిలోనికి వచ్చువరకు) వానిని విడిచివేయవల సినదేగదా! దీనికితోడు మదరాసు నగరము సగము భాగము ఆంధ్రుల దనక తప్పదు. అందుచే ఆంధ్ర ప్రాంతము లెక్కల గమనించునపు డా లెక్కలును గ్రహింపవలసినదే!

ఆంధ్రరాష్ట్రము.

| జిల్లాలు | వైశాల్యము | జనసంఖ్య |
|---|---|---|
| విశాఖపట్నము | ౯,౩౨౮ | ౩౪,౦౮,౩౦౭ |
| తూర్పుగోదావరి | ౬,౨౨౦ | ౧౯,౨౦,౫౭౨ |
| పశ్చిమగోదావరి | ౨,౩౬౧ | ౧౨,౨౩,౦౫౬ |

| | | |
|---|---|---|
| కృష్ణా | ౩,౫౪౭ | ౧౨,౫౪,౨౦౮ |
| గుంటూరు | ౫,౭౫౭ | ౨౦,౫౩,౬౬౦ |
| నెల్లూరు | ౭,౯౪౯ | ౧౪,౮౬,౨౨౨ |
| కడప | ౫,౯౧౯ | ౯,౪౯,౩౯౭ |
| కర్నూలు | ౭,౫౮౧ | ౧౦,౨౪,౯౬౧ |
| బళ్ళారి | ౫,౭౧౩ | ౯,౫౩,౭౭౪ |
| అనంతపురం | ౬,౭౪౧ | ౧౦,౫౦,౪౧౧ |
| చిత్తూరు | ౫,౯౦౧ | ౧౪,౪౭,౧౦౩ |
| మద్రాసునగరం | ౧౫ | ౩,౨౩,౬౧౫ |
| చెంగల్పట్టుపగం | ౧,౫౩౦ | ౧,౦౯,౦౪౬ |
| ఆంధ్రదేశం | ౬౭,౪౯౧ | ౧౭౧,౦౪;౮౯౭ |
| ఒరిస్సాలో పోయింది | ౨౬,౦౦౦ | ౨౬,౦౧,౬౫౨ |

ఈఆంధ్రరాష్ట్ర వైశాల్యము బరికించినగాని, జన సంఖ్య బరికించినగాని ఆంధ్రజిల్లాలు రాష్ట్రార్హత కలిగి యున్నవాయని ఆలోచన బయలుదేర నవశ్యమేలేదు. భారతదేశములోని రాష్ట్రముల వివరముల బరికింపుడు.

## రాష్ట్రాల వివరము.

| రాష్ట్రం | వైశాల్యం (చ. మైళ్ళు, వేలలో) | జనసంఖ్య (లక్షలలో) | చ. మైలుకు జనసాంద్రత |
|---|---|---|---|
| ఆంధ్ర | ౬౭ | ౧౭౧ | ౨౫౫ |
| మదరాసు | ౧౧౬ | ౪౪౦ | ౩౯౮ |
| బొంబాయి | ౭౭ | ౧౮౦ | ౨౩౪ |
| బెంగాల్ | ౮౨ | ౫౦౧ | ౬౧౧ |
| సంయుక్త | ౧౦౭ | ౪౮౪ | ౪౫౨ |

| | | | |
|---|---|---|---|
| పంజాబు | ౯౯ | ౨౩౬ | ౨౩౪ |
| బీహార్ | ౭౬ | ౩౨౪ | ౪౨౬ |
| మధ్యరాష్ట్రం | ౯౯ | ౧౫౩ | ౧౫౪ |
| ఆస్సాము | ౫౫ | ౮౬ | ౧౫౬ |
| సరిహద్దు | ౧౩ | ౨౪ | ౧౬౯ |
| ఒరిస్సా | ౩౨ | ౮౩ | ౨౫౮ |
| సింధు | ౪౬ | ౩౯ | ౮౫ |
| అజ్మీర్ మార్వారా | ౨ | ౫ | ౨౦౬ |
| అండమాన్ | ౩ | ౨౯ | ౯ |
| బెలూచిస్థాన్ | ౫౪ | ౪ | ౮ |
| కూర్గ్ | ౧ | ౧ | ౧౦౨ |
| డిల్లీ | .౫ | ౬ | ౧౧౧౦ |
| (కర్ణాటక | | ౬౫ | ) |

ఇందు చివర నుదహరించిన అయిదును కమీషనర్ ద్వారా పరిపాలింపబడుచున్న రాష్ట్రాలు. వాని సంగతి మనము తలపెట్టబనిలేదు. కూర్గునమాత్ర మొక చిన్న శాసనసభకలదు. అన్నిచోట్ల రాజప్రతినిధియే స్వయముగ కమీషనరులద్వారా పాలించును. అట్టిది మనము కోరుటయునులేదు. ఈకూర్గులోని శాసనసభయందు అయిదుగురు ప్రభుత్వ నియోజితులతో ౨౦ మంది సభ్యులుందురు. ఎంత చిన్న శాసనసభ.

ఈ అంకెల బరికించిన వైశాల్యమునను జనసంఖ్యయందును, ఆంధ్రరాష్ట్రవాదమున కర్తవ్యస్థాన ముండి

నంతనే ప్రయోజనమేమి? ఆర్థిక స్వయంపోషకత్వ ముండవలదా యందురు కాబోలు. కానిండు; అదియును పరికింపుడు. ఏయే రాష్ట్రములలో ఎంతెంత వచ్చుచున్నదో, అందు ప్రాత (౧౯౧౯) శాసనము ననుసరించిన రాష్ట్రముల ఆదాయవ్యయముల నొకసారి మున్ముందు పరికింపుడు.

రాష్ట్రాదాయములు (లక్షలలో)

(1935-36 సం॥)

| రాష్ట్రం | ఆదాయం | వ్యయం | ఫలితం |
|---|---|---|---|
| మద్రాసు | 1572 | 1604 | —32 |
| బొంబాయి | 1480 | 1508 | —28 |
| బెంగాల్ | 1143 | 1158 | —15 |
| సంయుక్త | 1179 | 1184 | —5 |
| పంజాబు | 1046 | 1057 | —11 |
| బీహారు-ఒరిస్సా | 554 | 561 | —7 |
| మధ్య | 456 | 481 | —25 |
| అస్సాము | 236 | 283 | —47 |
| సరిహద్దు | 170* | 176 | —6 |
| ఆంధ్ర | 727 | 720 | +7 |

(*కేంద్ర ప్రభుత్వసహాయంతో)

నూతనశాసన మమలునకువచ్చి సంవత్సరము గడచి రెండవసంవత్సరములో నుండగా ప్రాతలెక్కలేల

యందురా? గడచుచున్నది ౧౯౩౭-౩౮ సంవత్సర మైనప్పటికిని ఈ సంవత్సరపు టంకెలు లభ్యముకాలేదు. ఇంకను ఆయారాష్ట్రముల అంచనా నివేదికలు బడ్జటులు తయారుకాకపోవుటే యిందుకు కారణము. అందుచే ౧౯౩౬-౩౭ సంవత్సర నివేదికల ననుసరించిన రాష్ట్రాదాయ వ్యయముల నీక్రింద నుదహరించుచున్నాను.

రాష్ట్రాదాయవ్యయములు.

(లక్షలలో 1936-37)

| రాష్ట్రం | ఆదాయం | ఖర్చు | ఫలిత |
|---|---|---|---|
| మదరాసు | 1590 | 1590 | ౦ |
| బొంబాయి | 1204 | 1203 | + 1 |
| బెంగాలు | 1149 | 1191 | —42 |
| సంయుక్త | 1171 | 1245 | —74 |
| పంజాబు | 1080 | 1078 | + 2 |
| బీహారు | 470 | 482 | —12 |
| మధ్యరాష్ట్రాలు | 481 | 490 | — 9 |
| అస్సాము | 237 | 300 | —63 |
| సరిహద్దు | 170౦ | 180 | —10 |
| ఒరిస్సా | 163౦ | 163 | |
| సింధు | 313౦ | 313 | |
| ఆంధ్ర | 727 | 720 | +7 |

ఈ అంకెల బరికించినపుడు ఆంధ్రరాష్ట్ర మెంత ఆర్థికసౌష్టవత గలిగినదో, నూతనముగ నిర్మాణము

గావించిన రాష్ట్రములకన్న నెంత అధికార్హముగ నున్న
దో బోధపడినను ఆంధ్రరాష్ట్రమునకే ౭-౯౭ కోట్ల ఆదా
య మెటులు వచ్చినదా, నోటికి అంకెలు వేసిరా, యని
అనుమానము కలుగవచ్చును. ఈ ఆంధ్రరాష్ట్రాదాయ
మున కాధారమిదిగో:

ఆంధ్రరాష్ట్రము

| శాఖలు | ఆదాయము |
|---|---|
| భూమిశిస్తు | 3,90,66,747 |
| ఎక్సైజుపన్ను | 2,40,28,437 |
| రిజిస్ట్రేషను | 9,45,882 |
| స్టాంపులు | 46,12,480 |
| అడవులు | 21,48,362 |
| ఉప్పు | 18,51,966 |
| జమీలవల్ల | 17,36,124 |
| ఆంధ్రరాష్ట్రం ఆదాయము | 7,43,90,018 |

ఇందులో ఇంకను కొన్ని లెక్కలు రావలసియున్నవి. ఆ రావలసినవటుండ ఇప్పటికేర్పడిన సంఖ్యలోనే ౧౯ లక్షలు తగ్గింపబడియే అంచనా వేయబడెను. ఇవుడు మద్రాసు రాజధాని ప్రభుత్వమునకు ఆంధ్రజిల్లాలయందయిన ఖర్చుల నన్నింటిని తేల్చియే ఈ ౭-౯౦ లక్షలుగా నిర్ణయింపబడెను. ఈ ఆయావ్యయములకు సంబంధించిన అంకెల నింకను యివ్వగలనుగాని గ్రంథవిస్తరమగునని వెనుకాడవలసివచ్చెను. ఇంతకన్న ఎక్కువ ఆదాయ

మును, తక్కువ వైశాల్యమును, తక్కువ జనసంఖ్యయు గల కొన్ని దేశములు (పిదేశాలలో) స్వతంత్ర దేశము లై సర్వతంత్ర స్వతంత్రముగ వ్యవహరించుచున్నవి.

ఉదాహరణార్థ మీక్రింది దేశముల బరికింపదగును

నానాదేశాలు

| దేశం | వైశాల్యం | జనాభా | రాజ్యాంగం |
|---|---|---|---|
| ఆంధ్ర | 67,491 | 1,71,04,897 | ? |
| జికోస్లోవికియా | 54,000 | 1,46,00,000 | ప్ర. |
| డెన్మార్కు | 16,570 | 35,00,000 | రా |
| డొమినికన్ రిపబ్లిక్ | 19,300 | 10,22,000 | ప్ర. |
| గ్రీసు | 50,000 | 62,05,000 | రా |
| ఐర్లాండు | 32,400 | 30,00,000 | ప్ర. |
| పాలస్తైయిన్ | 10,000 | 10,35,000 | ప్ర. |
| పోర్చుగల్ | 35,410 | 15,0,00,000 | ప్ర. |
| సింహళము | 25,000 | 45 00,000 | కా. |
| మళయా | 31,000 | 35,00,000 | కా. |

సూచన—ప్ర—ప్రజాస్వామికము, రా, రాజరికము
ఆ— అధినివేశము, కా. కాలనీ ర—రక్షితరాజ్యము

ఇన్ని అర్హతలు అవకాశములున్న ఆంధ్రజిల్లాలు ప్రత్యేక రాష్ట్రముగ విభజించుట కెంత అలసత్వమేలనో పరిపాలనా సౌకర్యములును, జిల్లాల సౌష్ఠవమును, శాసన సభా ప్రాతినిధ్యావకాశములును యెటులున్నవో వానిని

బరికింపుడు. జిల్లాల సంఖ్య ఎసెంబ్లీ కౌన్సిలు సభ్యుల సంఖ్య నుదహరింతును.

### రాష్ట్రాలు.

| రాష్ట్రం | జిల్లాలు | అసెంబ్లీ | కౌన్సిలు |
|---|---|---|---|
| మదరాసు | 26 | 215 | 56 |
| బొంబాయి | 20 | 175 | 30 |
| బెంగాలు | 28 | 250 | 65 |
| సంయుక్త | 48 | 228 | 60 |
| పంజాబు | 29 | 175 | లేదు |
| బీహార్ | 17 | 152 | 30 |
| మధ్యరాష్ట్రాలు | 22 | 112 | లేదు |
| అస్సాము | 12 | 108 | ౨౨ |
| సరిహద్దు | 5 | 50 | లేదు |
| ఒరిస్సా | 7 | 60 | లేదు |
| సింధు | 9 | 60 | లేదు |
| ఆంధ్ర | 12 | 150 | వలదు |

ఏ విధముగ బరికించినను రాష్ట్రముకాదన వీలు లేదు. రాష్ట్రస్వపరిపాలన మొసంగితిమని ప్రభుత్వము వారు ఇటు జిల్లా కలెక్టరులనుండి బ్రిటీషు ప్రధానివరకు గల అంతస్థులవారి అధికారులందరు ఏకరవు పెట్టుచున్న ఈ దినములలో గవర్నరులు మంత్రుల పరిపాలనములో జోక్యము కలిగించుకొనము అని హామీనిచ్చినచో నది రాష్ట్ర స్వపరిపాలనమే యనియు అట్టిహామీలో అయిదు సంవత్సరముల పాటు రాజ్యము పాలింపబడిన నది స్వ

రాజ్యము కాగలదనీ దేశీయ నాయకులు గంభీర నినాద ముల నొనరించుచున్న ఈదినములలో ఆంధ్రుల కాంధ్ర రాష్ట్రమే యుండిన నెంత యభ్యున్నతికి గాగలిగెడి వారోకదా! రాష్ట్రాందోళనము బయలుదేరదీసి ముప్పది సంవత్సరములు కావచ్చినను ఆంధ్రరాష్ట్రము బడయ లేక పోయితిమి.

## తీవ్రాందోళన అవసరం

ఆంధ్రులలో రాష్ట్రమునకై కలుగవలసినంత ఆందోళనము ప్రబలలేదు. హృదయావేదన కలుగలేదు. సామాన్యముగు నాందోళనముతో జాలదు.

ఇప్పటికైనను ఆంధ్రులంద రేకకంఠముతో ఆంధ్రరాష్ట్రము నాకాంక్షింతురేని ఆ హృదయావేదన బయలుదేరవలెను. సైమన్ ఇదివరలో ఆంధ్రరాష్ట్ర సమస్య తీవ్రాందోళనముగ గన్పించినదనినాడు. అంత ఆందోళన కన్పించినను మనము రాష్ట్రమును బడయ లేక పోయితిమి. నేడటులగాదు. అధికతర తీవ్రసంచ లనము గావించవలెను. అటు శాసనసభలలోను, ప్రభుత్వముద్వారాయును ఇటు ప్రజాప్రబోధమువలనను సంచలిత మొనరించవలెను.

## ౧౯౩౫ శాసనం

౧౯౩౫ వ సం॥ ఇండియా శాసనములోని ౨౯౦ సెక్షను నాధారపరచుకొని ఆంధ్రరాష్ట్రమును సృష్టింపవచ్చును. నేడు సృజించవలెను. ఈ సెక్షనులో యిట్లున్నది.

“ఈ సెక్షనులోని అవకాశముల ననుసరించి సార్వభౌముడు ఆర్డరు ఇన్ కౌన్సిలుద్వారా

(ఎ) నూతన రాష్ట్రమును సృజించవచ్చును.

(బి) ఏరాష్ట్ర వైశాల్యము నేని హెచ్చింపవచ్చును.

(సి) ఏరాష్ట్ర వైశాల్యమునేని తగ్గించవచ్చును.

(డి) ఏరాష్ట్ర సరిహద్దుల నేని మార్చవచ్చును.”

అయితే అట్టి మసాయిదా యేదేని పార్లమెంటు ముందు ప్రవేశపెట్టబడుచో సార్వభౌముడు కోరినవిధముగా ఫెడరలు ప్రభుత్వముయొక్కయు, ఫెడరలు శాసనసభల యొక్కయు ఈ ఆర్డరువలన ఫలితమును బొందు రాష్ట్రముయొక్క లేక రాష్ట్రముల యొక్క ప్రభుత్వపుటభిప్రాయమును, శాసనసభల యొక్కయు అభిప్రాయమును స్టేటు కార్యదర్శి సమీకరించవలెను.

౨౯౦ వ సెక్షను అనినంతనే ఫెడరేషను అమలుకు వచ్చిననేగదా ఆంధ్రులు రాష్ట్రమును బడయగలుగుటయని తలంపబనిలేదు. ౨౯౦ వ సెక్షనులో నుదహరింపబడిన ఫెడరేషను శాసనసభలు అనునది ౩౧౬ వ

సెక్షను ప్రకారము ఫెడరేషను అమలునకు వచ్చువరకు ఇండియన్ శాసనసభలుగ వ్యవహరింపబడవలెననియు, ఫెడరల్ కార్యవర్గము గవర్నరుజనరల్ అనునవి ౧౯౧౯ శాసనము రద్దయినప్పటికిని అమలునందేయుండునని ౩౧౭ వ సెక్షనునందుదహరింపబడి యున్నది. అందుచే రాష్ట్రము విభజింపబడుటకు ఫెడరేషను అవసరంలేదనియు, ౧౯౩౫ శాసనముచే యేర్పడిన రాష్ట్ర ఎసెంబ్లీ కౌన్సిలును, రాష్ట్రప్రభుత్వమును ౧౯౧౯ వ శాసనము క్రింద నిర్వహింపబడుచున్న భారతశాసనసభ (డిల్హీ ఎసెంబ్లీ, స్టేటుకౌన్సిలు) లును; గవర్నరుజనరల్ ఇన్ కౌన్సిలనుపేరిట వ్యవహరింపఁబడు కేంద్రప్రభుత్వమును చాలుననియు, రాజ్యాంగశాసన నిబంధనలేవియు అడ్డు తగులనేరవనియు తేలిపోవుచున్నది.

౧౯౩౫ వ ఇండియా శాసనములోని ౨౯౦ వ సెక్షనును నాధారపరచుకొని "నూతన రాష్ట్రమును సృష్టించవచ్చును. కాదు-సృష్టించవలెను."

నేటి శాసనము ప్రకారము అధికారముస్వీకరించవలసిన అధికసంఖ్యాకపక్షము కాంగ్రెసు అధికారము స్వీకరించినది, రాజ్యాంగము నడపుచున్నది.

ఇట్టి పరిస్థితులలో నాంధ్రుల కర్తవ్యమేమి? ఆంధ్ర వ్యక్తిత్వము విస్మరింపరానిది. విస్మరింపబడనిది.

ఆంధ్రరాష్ట్ర విభజనము కాంగ్రెసు కార్యవర్గము చేతిలోనున్నది. కాంగ్రెసు తన రాజ్యాంగములో నిదివరకే ఆంధ్రరాష్ట్రము నిచ్చినది. మదరాసు రాజధాని శాసనసభలలో కాంగ్రెసుదే బలము. ప్రభుత్వము కాంగ్రెసుమంత్రులది. కాంగ్రెసు రాష్ట్రములలో మంత్రాంగములను కాంగ్రెసు కార్యవర్గమే నడుపుచున్నది. ౧౦-౬-౩౭ న నంద్యాలలో ఆంధ్రరాష్ట్రీయ మహాసభ సమావేశమై మదరాసు రాజధానిలోని శాసనసభ్యులు వెంటనే ఆంధ్రరాష్ట్ర ప్రయత్నము రాష్ట్ర, ఢిల్లీ శాసనసభలలో చేయవలసినదని హెచ్చరించుచు తీర్మానించెను. తరువాత చిత్తూరులో ౧౯౩౭ వ సంవత్సరం సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము వారు సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును గోరుచు అఖిలభారత కాంగ్రెసు సంఘమువారిని కోరుచు తీర్మానించిరి. శ్రీ డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు రాయలసీమయం దంతటను విరివిగ ప్రచారముగావించి ఆంధ్రుల ఐక్యతకు తీవ్రకృషిసల్పిరి.

అటు తర్వాత ఆంధ్రమహాసభ సమావేశము బెజవాడ శ్రీదుర్గాకళామందిరమున శ్రీ క. కోటిరెడ్డిగారి అధ్యక్షతను ౧౯౩౭ సంవత్సరం అక్టోబరు ౨౧ వ తేదీ బ్రహ్మోత్సవముగ జరిగెను. అందుతో బాటు ఆంధ్ర

ధ్యమ రజతోత్సవమును శ్రీ టి. యన్. రామకృష్ణారెడ్డి గారి అధ్యక్షతను జరుపబడెను. ఆ ఆంధ్రసభలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్థలనిర్దేశమువలన సంబంధించిన దానిపై పరిణమించిన తమలోతమకుగల భేదాభిప్రాయమును నిర్మొగమోటముగ వెల్లడించుకొనిరి. అట్టి అభిప్రాయ భేదముల తోనాటి ఆంధ్రైక్యత సమకూర్చుటకు తగు నిర్ణయమునకు వచ్చుటకొరకు ఉపసంఘము నిర్మాణముగావించిరి. ఈ ఉపసంఘ నిర్ణయమైన తర్వాత రాయలసీమలో ఆంధ్రమహాసభ జరుపుటకు నిర్ణయించిరి.

ఇంతలో అక్టోబరు ౨౫వ తేదీ కలకత్తాలో శ్రీ జవహర్‌లాల్ నెహూృగారి అధ్యక్షతను సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు సంఘమున శ్రీపట్టాభిగారుపపాదించిన ఆంధ్రరాష్ట్ర తీర్మానము ఏకగ్రీవముగ అంగీకరింపబడుటయే గాక భాషా ప్రయుక్తముగ అన్ని రాష్ట్రములు వెంటనే విభజింపబడుటకు కాంగ్రెసు మంత్రాంగములు తీవ్రప్రయత్నములు చేయుటకును, అవసరమగు తీర్మానములు శాసనసభలలో నెగ్గించుటకును తీర్మానింపబడెను.

ఆంధ్రమహాసభ ఉపసంఘము వారు ౧౯౩౭ నవంబరు ౧౬వ తేదీ చెన్నపురిలో శ్రీబాగ్‌నందు సమా

వేశమై ఒక నిర్ణయమునకు వచ్చిరి. ఆనిర్ణయమే శ్రీబాగ్ ఒడంబడిక. దానిని హిందూపురంలో డిసెంబరు ౧౮ వ తేదీ సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు అంగీకరించిరి.

## శ్రీబాగ్ ఒడంబడిక.

౧. ఆంధ్రులలో సంస్కృతి, సాంఘిక ఐకమత్యము పెంపొందుటకును, వైజ్ఞానిక కేంద్రములను ఆంధ్రదేశము నంతటికిని నుపయోగపడజేయుటకును, ఆంధ్ర విశ్వవిద్యాలయమును వాల్తేరులో నొక కేంద్రమును, అనంతపురంలో నొక కేంద్రముగా అభివృద్ధిపరచవలెను. ఇతర కళాశాలలను తత్సంబంధమగు విషయపరిజ్ఞానమున కనుకూలమగు చోట్ల నెలకొల్పవలెను.

౨. రాయలసీమ నెల్లూరు జిల్లాలలో వ్యవసాయ ఆర్థిక అభివృద్ధి కోస్తాజిల్లాలతో సరిసమానముగా కలుగు నిమిత్తమై పదేండ్ల వరకును అవసరమగుచో అంతకంటె ఎక్కువకాలముగాని, నీటిపారుదల స్కీములను ముఖ్యముగా, పినాకినీ కృష్ణా నదుల నీటినిగురించిన వానికే పైనపేర్కొనబడిన జిల్లాల మేలునిమిత్తమై, ప్రాధాన్యమివ్వవలసినదనియు, మేజరుప్రాజెక్టుల విషయమున గూడ పదేండ్లకాలము ఈజిల్లాల యభివృద్ధికొరకే ప్రభుత్వదృష్టి కేంద్రీకరింపబడవలెననియు, ఎప్పుడైనను పైనదుల నీటిపంపకము విషయమై తగాదాలు కలిగినప్పుడు మీద పేర్కొనబడిన జిల్లాల అవసరమును మొ

దటి తీర్చవలెననియు, ఈ విధానము నేటినుండియే ప్రభుత్వము అమ లునకు తే బ్రయత్నింపవలయుననియు,

3. జిల్లా కింతమందియని సమానసంఖ్యగల ప్రాతినిధ్యము శాసనసభలలో నుండును.

౪. విశ్వవిద్యాలయము, హైకోర్టు, ముఖ్యపట్టణము, ఈమూడును ఒక్కచోటనేచేర్చి ఒక్కప్రదేశమునకే ప్రాముఖ్యము నిచ్చుటకం టె వేరువేరు ప్రదేశములలో నుండుట మంచిదని తలంచుచు, విశ్వ విద్యాలయము ఉన్నచోటనే ఉండవచ్చుననియు, హైకోర్టు ముఖ్య నగరము కోస్తా జిల్లాలలోను, రాయలసీమలోను ఉచిత ప్రదేశ ములలో నుండవలెననియు ఇందులో ఏదికావలెనో రాయలసీమ వారే కోరుకోవలెను.

౫. ఈ ఒడంబడిక ఉభయుల అంగీకారముపై మార్చుకొన వచ్చును.

## ఆంధ్రసౌహార్ద సంఘము.

ఈ ఒడంబడికపై ఉత్తరాంధ్రుల ప్రజాసామా న్యాభిప్రాయమును తీసికొనుట సమంజసమని-అవసరమని తలంచి ౧౯౩౭ జనవరి ౧౭ తేదీ మొదలు ౧౦ దిన ములు "ఆంధ్ర సౌహార్ద సంఘ" మను పేరిట శ్రీ కె. కోటిరెడ్డి గారి నాయకత్వమున రాయలసీమ సోదరులును ఉత్తరాంధ్ర సోదరులును కలిసి, కృష్ణా, ఉభయగోదా

వరి విశాఖపట్నం, గుంటూరు జిల్లాలలోని ముఖ్యపట్ట ణములలోను, అందేకాక ఆంధ్రప్రాంతములనుండి విడి వడిపోయిన బరంపురం పర్లాకిమిడిలకును వెడలి బహిరంగ గసభలు గావించి, ఇష్టాగోష్ఠి జరిపి, చర్చలుజరిపి ఆంధ్ర సౌహార్ద్రముబడసి ఈ ఒడంబడికపై సర్వతో ముఖమగు అంగీకారమును బడసిరి. ఆంధ్రవాంఛ బలీయమాయెను. ఆంధ్రులని సగర్వముగ చెప్పగలిగిన ఆశజనించెను. ఆంధ్ర విద్యార్థులు విశాఖపట్నమునను, చెన్నపురిలోను గావించిన ఆంధ్రోత్సవమును బ్రహ్మోత్సవముగ దిగ్వి జయముగ జరిపి ఆంధ్రోద్యమమనిన కనురెప్పలు వాల్చు చున్న ఇంగ్లీషు పత్రికాధిపతుల కన్నులు తెరుపగలిగిరి.

## రాష్ట్ర శాసనసభలు.

ఈ ఆందోళనా ఫలితముగ ఈ ప్రచారఫలితము గ, ఈ ఐక్యీకరణ ఫలితముగ, రాష్ట్రకాంగ్రెసు సంఘ ము యొక్కయు, తదధ్యక్షులగు శ్రీ డాక్టరు పట్టాభిసీతా రామయ్యాగారి తీవ్రకృషి ఫలితముగను 80 మంది కాం గ్రెసు శాసనసభ్యులు రాష్ట్ర తీర్మానమును పార్టీలో ప్రవేశపెట్టవలసినదిగ కోరిన దాని ఫలితముగను మద్రా సు శాసనసభలలో రాష్ట్ర తీర్మానము ప్రవేశపెట్ట బడెను. ఈ ఈతీర్మాన విషయంలో ఆంధ్రరాష్ట్ర విభజన విషయమే ఉపపాదించుటయూ లేక, భాషా ప్ర

యుక్తముగ రాజధానిలోని అన్ని భాషా ప్రాంతముల ను పునర్విభజించు తీర్మాన ముపపాదించుటయా యని యు, తీర్మానము ప్రభుత్వమే ఉపపాదించుటయా లేక అనధికారవుసభ్యు లుపపాదించుటయా యనియు చర్చించి ఎట్టకేలకు శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యగారిచే ఉ. పపాదింపఁబడి రాజధానిలోని ఆంధ్రము, తమిళము, కర్ణా టకము, కేరళము అధిక సంఖ్యగ మాట్లాడు ప్రాంతము లను భాషా ప్రయుక్త రాష్ట్రములుగ విభజింపవలెనని ఇండియా కార్యదర్శినికోరుచు మదరాసు అసెంబ్లీలో ౧౯౩౮ సంవత్సరము మార్చి ౩౦వ తేదీనను, కౌన్సిలులో ౩౧ వ తేదీనను ఏకగ్రీవముగ తీర్మానింపబడెను. వలు రాష్ట్రములలోనున్న కర్నాటక ప్రాంతములను ఏక రాష్ట్రముగ నిర్మించవలసినదిగా ఇండియా కార్యదర్శిని కోరుచు బొంబాయి రాజధానిలోని ఎసెంబ్లీయును కౌన్సిలును ఏకగ్రీవముగ ఏప్రిల్ (౧౯౩౮) నెలలో తీర్మానించిరి.

బొంబాయి ప్రభుత్వము కర్నాటక రాష్ట్ర తీ ర్మానమునుగురించి మదరాసు ప్రభుత్వమునకు వ్రాసిరని తెలియుచున్నది. చెన్నరాజధాని మంత్రివర్గమువారు చెన్నరాజధానిని భాషాప్రయుక్త రాష్ట్రములుగ విభజింపవలెనని ఢిల్లీ ప్రభుత్వమునకు గట్టిగ వ్రాసిరని

యు, అందు ఆంధ్రుల వాంఛ బలీయమనియు, అన్ని అర్హతలు కలవని ప్రత్యేకముగ వ్రాసిరనియు తెలియుచున్నది. ఇక మిగిలినది డిల్లీ శాసనసభలలో గూడ తీర్మానించునటుల జేయుట; ఇండియా ప్రభుత్వాంగీకారమును పార్లమెంటుకు పంపునట్లుచేయుట; ఆంధ్రులు స్వీయరాష్ట్రమును బడయుట; ఇవి జరుగవలెను. అందుకై ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమును, ఆంధ్రప్రజలును, కాంగ్రెసు కార్యవర్గమును తీవ్రముగ వత్తిడిచేయవలెను. సత్వరాంధ్రరాష్ట్రసిద్ధికై ఇంగ్లాండుకు రాయబార మంపవలెను.

ఏనాడో భాషాప్రయుక్త రాష్ట్రవాదము నంగీకరించిన కాంగ్రెసుపాలనములో, రాజకీయముగ ఆంధ్రులకు రాష్ట్రమొసంగి ఆంధ్రజాతి పూర్వగౌరవస్థానమున నిలచుట కవకాశమొసంగిన కాంగ్రెసు రాజ్యములో, ఆంధ్రరాష్ట్రము బడయవలెను. దేశమున నధికతర ప్రబోధము ఆందోళనము జరుపబడవలెను. అందున నాంధ్రరాష్ట్ర సమస్యయే తీవ్రరూపముదాల్చి బెంగాలు విభజనమున నవవంగీయులు చూపిన ఉత్సాహమును వెల్లివిరియించి రాష్ట్రమును సముపార్జించవలెను. ఇపుడే ప్రజల ప్రబోధింపవలెను.

## పల్లెలలో ప్రబోధము

పల్లెపల్లెలోను ఆంధ్రప్రబోధ మొనరింపబడవలయును అధికారి మొదలు అనధికారివరకు, కృషీవలుడు మొదలు రాజేంద్రునివరకు ప్రతి పల్లెయందును ప్రతి కుగ్రామము నందును, ప్రతి కుటీరమునందును, ప్రతి బస్తీయందును గ్రామ సభలు, ఫిర్కా సభలు, తాలూకా సభలు, మండల మహాసభలు గావించి జగజ్జేగీయమానమగు ప్రబోధము గావింపవలెను. ప్రతి సభనుండియు జిల్లా కలెక్టరు, గవర్నరు, గవర్నర్ జనరల్, ఇండియా కార్య దర్శులకు చిట్టచివరకు సార్వభౌమునకును

"చారిత్రకముగ క్రీస్తు పూర్వమునుండియు ప్రఖ్యాతిగడించి నట్టియు, రాజకీయముగ నొకప్పుడు భారతదేశము నేకచక్రముగ నేలినట్టియు, వైజ్ఞానికముగ ప్రపంచవిఖ్యాతి బడసినట్టియు, ఆర్థిక ముగ స్వయంపోషకమైనట్టియు, భాషావిషయకముగ స్వతంత్ర సార స్వతమును గలిగినట్టియు, అత్యంతవైశాల్యమును, నధిక జనసంఖ్యయు గలిగియున్న ఆంధ్రభూమిని వెంటనే ప్రత్యేకరాష్ట్రముగ నేర్పరుప వలెనని ప్రభుత్వమువారిని ఆంధ్రు లైక్యకంఠముతో, తీవ్రముగ నర్థించుచున్నారు."

అను తీర్మానమును ప్రతిసభయందును గావించి పంపుడు. మహజరులపంపుడు. రాయబారములనడుపుడు. ప్రాంతమునగల అధికారులకడకు యాత్రల సాగింపుడు.

మన మాంధ్రులము, ఆంధ్రరాష్ట్రము లభించు నంతవరకు నిరంతరము కృషిచేయుట మనవిధి. భారత దేశములో భాషాప్రయుక్తముగ రాష్ట్రములు విభజింప బడవలెనని ప్రాతిపదిక వేసినది మనము, ఆంధ్రులము. బహుశః అట్టి రాష్ట్రములు విభజింపబడవలె ననుకొను టలో- బడయుటలో- చిట్టచివరవార మగునదియును ఆంధ్రులమగు మనమేగాబోలు. వైశాల్యము, ఆదాయము, జనసంఖ్య అన్ని వున్నవికాని రాష్ట్రములేదు. అందులకు కారణము ఆంధ్రుల దౌర్భాగ్యమే! రాష్ట్రాందోళన బయలుదేరదీసి ముప్పది సంవత్సరములు కావచ్చినను రాష్ట్రము బడయలేకపోయితిమి. నిన్నగాక మొన్న తమకు రాష్ట్రము కావలెనని కండ్లుతెరచిన సింధు, ఒరిస్సాలు మనలను నడుమనెక్కడనో త్రొక్కివేసి తాము తమ స్వరాష్ట్రములను సముపార్జించుకొనిరి. మన ఆందోళనము అరణ్యరోదన మైపోయినది. ఆంధ్రరాష్ట్ర సమస్యయే అంతరించినదా యనిపించుచున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయము అవతరించి అసలున కెసరుపెట్టినది. ఆంధ్రులలో అంతర్భేదములు, వివాదములు, పరస్పర ద్వేషములు జనింపజేసినది. రాయలసీమను ఆంధ్ర సీమనుండి అంతరింపజేసి అరవచదువుల కంటగట్టినది. రాయలసీమవారి నుత్తరాంధ్రులపై తీవ్రభేదభావమును

పెంపొందింప జేసినది. అది అంతరించనేలేదు. ఇట్టి విషమపరిస్థితులు కన్నారజూచుచు నూరకుండవలసిన దేనా? ఉత్తరాంధ్రులు పశ్చిమాంధ్రులను దూరస్థులుగ తలంచుట సహింపరానిది. దీర్ఘనిద్రా ముద్రితంబై కదలకున్న ఆంధ్రుల చలనశక్తికి కదలిక కలుగవలెను. ఇప్పటికైనను గృహచ్ఛిద్రములను, ఈతిబాధలను సరి చేసుకొందురా లేక ఉత్తరాంధ్రులు వేరని, పశ్చిమాంధ్రులు వేరని, దక్షిణాంధ్రులు వేరని యెవరికివారు గిరి గీచుకొని ఖండఖండములుగ విడిపోవలసినదేనా? ప్రభుత్వమువారు వంగదేశమును విభజించినంతనే దేశమునం దంతటను అగ్నిపర్వతము ప్రజ్వరిల్లినట్లు ఆందోళనా జ్వాలలను లేవదీసి వంగీయు లఖండవిజయమును పొంది యుండగా మనమో చేతులార జన్మభూమి ముక్కముక్కలుగ చేసికొన బ్రయత్నించుచున్న నిర్వీర్యులము. దద్దమ్మలము! ఇదియే కాబోలు ఆంధ్రతత్వము! ఇది యేనా, మనప్రజ్ఞ! ఉత్తరాది దక్షిణాది పశ్చిమాది వారందరు ఆంధ్రులుకారా? వారికి వీరికి భేదమేమి? వారు మాట్లాడునది తెలుగుకాదా? మన కమ్మనవు దియ్యని తెలుగుకాదా! మనయందర ఆదర్శములు, సాంప్రదాయములు, శ్రద్ధాభక్తులు ఒక్కటేకావా! మనసాహిత్యము, మనచరిత్ర, మన విజ్ఞానము వారి

కెట్లో అట్లే మనకును పూజనీయములు కావా! ఆరాధ్యము ములుకావా? తిక్కన తెలుగు బిగువును, వేమన జీవన సందేశమును, పెద్దనామాత్యుని సరసకవితా చాతుర్యమును, పోతనామాత్యుని భక్తిపరిపూరిత కావ్యమాధుర్యమును, బసవారాధ్యుని భావగాంభీర్యమును నన్నపార్యుని యుభయభాషా పాండితిని ఆంధ్రులందరును గోరిలుటలేదా? ఎందుల కీభేదభావములు! ఎందులకీ అవిశ్వాస ప్రకటనలు. ఓఢ్రులు రాష్ట్రమును సముపార్జించుకొని సంవత్సరమయ్యెను కేంద్రనిర్ణయమున కింకను పెనగులాడుచుండ, ఏమియులేని ఆంధ్రులు కేంద్రసమస్యను సాకుగగొని అసలు మహోద్యమమును మంటగలియజూచి మూలద్రోయుట భావ్యమా! ఆంధ్రమాతృగర్భమును నిర్భేదించు, ఖండఖండములుగ ఖండించు, అభాగ్యులమా మనము?అహా! ఏమి కాలగతి ? ఎంతటి అజ్ఞానము, ఎంతటి సాహసము, ఎంతటి ద్రోహము,... ఆలోచింపుడు. భేదములు త్యజింపుడు. శాంతిసఖ్యముల నెలకొల్పుడు. ఆంధ్రైకమత్యమును పునరుద్ధరింపుడు.

"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు,
ఓరుగల్లున రాజ వీరలాంఛనముగ ।
బలుశస్త్రశాలలు నిల్పునాడు

విద్యానగర రాజవీధులఁ గవితకు
పెండ్లిపందిళ్లు కప్పించునాడు
పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయస్తంభ మెత్తించునాడు

ఆంధ్రసంతతికే మహితాభిమాన
దివ్యదీక్షా సుఖస్ఫూర్తి వరించె
నా మహావేశమర్థించి ఆంధ్రులార
చల్లు డాంధ్రలోకమున నక్షతలు నేడు."

అధికారపీఠముల నధివసించిన ఆంధ్రాభిమానులు రాష్ట్రవిభజనమగుటకు తీవ్రకృషిచేయుట కవసరమగు సహాయ సంపత్తులను, ప్రజాభిమతమును, తీవ్రాందోళనమును, తీవ్రప్రజోద్యమమును సాగింపవలెను.

ఆంధ్రరాష్ట్రవాంఛను ఆంధ్రులెల్లరు-రెండున్నర కోట్ల ఆంధ్రులు-ఆంధ్రజిల్లాలలో నుండనిండు ఆంధ్రేతర ప్రాంతములలో నుండనిండు-ఐక్యకంఠముతో భూనభోంతరాళములు బ్రద్దలగునట్లు, భారతదేశమేగాక దూర ప్రాంతములనున్న ఆంగ్లదేశమును చలించునట్లు, ప్రభువుల సభలు ప్రకంపించునట్లు, ప్రజాసభలు ప్రతిఘటించలేనట్లు, ఆంధ్రరాష్ట్రము కావలెనని భేరికాడాండ డడాండ నినదంబు లజాండమునిండ ప్రకటింపుడు.

ప్రతిచోటను ఆంధ్రప్రభల గట్టి వీరరంగముల చేయించుడు. ఆంధ్రోత్సవముల గావింపుడు. ఆంధ్ర పత్రములతో, నకుంఠితమగు నాంధ్రదీక్షతో ఆంధ్ర మాతృపద సేవన వాంఛతో నిత్య యౌవనులగు నాంధ్ర యువకు లంతరించలేదని, ఆంధ్రయువకోజ్జీవంబు నిర్జీవంబు కాలేదని మీపై దోడులు వంగయువకులు, సహచరులు ఒధ్రులు, మీతోడి బంధువులు సైంధవులవలె మీరును దీక్షాబద్ధులై రాష్ట్రమును సముపార్జించి మీ జీవితమును ధన్యమొనరింపుడు. ఆంధ్రరాష్ట్రము లభించిననాడే రెండున్నరకోట్ల ఆంధ్రుల బ్రసవించిన ఆంధ్ర మాతృగర్భము ఫలించినదనదగును. ఆనాడే ఆంధ్రులు సజీవులై యుండిరని చెప్పుకొనుట కవకాశము కలుగును. ఆంధ్రపౌరుషము చావలేదని, ఆంధ్రజాతి అంతరించ లేదని ధ్రువపరుపుడు.

ఆంధ్రమహాసభను ప్రజాప్రతినిధి సభగను, ఆంధ్ర సమస్యను జీవనసమస్యగను, ఆంధ్రోద్యమమును, ప్రజోద్యమముగను, జేయవలయును. ఆంధ్రరాష్ట్రమంతయు నొక్కమారేని సంపూర్ణయాత్ర జరిపి నిద్రాణమైన ఆంధ్రరాష్ట్రాభిలాషను, విడివడిన ఆంధ్ర పౌరుషమును, మూకీభావము వహించిన ఆంధ్ర తేజమును పుంజీభూత, మొనరించి యొక్కమ్మడి ఆంధ్రలోకమునం దంతటను

సింహగర్జన మొనరించవలెను. ఆంధ్రులయందు నూతనోత్సాహమును, ఆవేశమును రేకెత్తించవలెను. ఇదియే అదను. సమయము మించిన చేయగలిగినది లేదు. లెండు! ఆంధ్రులారా, నడుములు బిగియగట్టుడు! దీక్షాబద్ధులు గండు !

"జారిన దేశగౌరవము జక్కనదిద్ది మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగ బాలనజేసి సమానరాష్ట్రముల్
కూరిమినాశజేయ తెలుగుం బుడమిన్ గయిసేయరయ్య, దీ
క్షారతి సాంధ్రపుత్రులు జగజ్జన ధర్మమె దృష్టినిల్పుచున్"

---

# సహాయపడిన గ్రంథావళి.

—)o(—


| గ్రంథము | | గ్రంథకర్త |
|---|---|---|
| ఆంధ్రోద్యమము | — | ఆంధ్రమహాసభవారిది (౧౯౧౩) |
| ఆంధ్రోద్యమము | — | ఆంధ్ర పత్రికవారిది |
| ఆంధ్రుల చరిత్ర | — | చిలుకూరి వీరభద్రరావు (౧౯౧౪) |
| ఢిల్లీ దర్బారు | — | కే. వి. లక్ష్మణరావు |
| కాంగ్రెస్ చరిత్ర | — | డా. భోగరాజు పట్టాభిసీతారామయ్య |

ఆంధ్రపత్రిక, భారతి, ఉగాది సంచికలు.

ఆంధ్రపౌరుషము, గ్రంథాలయ సర్వస్వము (పద్యములు)

For and Against Andhra Province 1913

Report of Joint Parliamentary Committee 1919

Government of India Act 1919

Report of the 1st National Convention 1928

Nehru Committee Report 1928

Swarajya Constitution 1928

Report of the Indian Statutary Commission 1930

Report of Indian Census 1931

Proceedings of the Second Roundtable Conference 1931

Memoranda of the Andhra Mahasabha 1931

White Paper 1933

Report of the Joint Parliamentary Committee 1934

Report on Agricultural Indebtedness (Madras) 1935

Report of the Delimitation Committee
(Madras) 1935

Government of India Act 1935

Report of the Indian Delimitation Committee
(Hamond) 1936

Financial Report by Sir Otto Nemier 1936

Indian Year-book 1937

Hindusthan Year-book 1937

Triveni (February & March 1937)

Budget of the Government of Madras 1936-37

---

సాధన ప్రెస్, అనంతపురం.

54



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 103 B 177 |
| పుస్తకం పేరు | ఆంధ్రారణ్యము |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 59 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | hema |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |